215

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] [సంచిక 7

15 అక్టోబరు 1952

2 15 / 4.52



సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు బి.ఏ.

వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యాగారు.



ప్రకాశకులు:

రామా అండ్ కో.

H.O. ఏలూరు

V.S. GURU

# విషయసూచిక

# ఆంధ్రరాష్ట్ర
# ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] ఏలూరు, అక్టోబరు 15 [సంచిక 7





**వివరణము :**

ధ్యానకాలమున నీ చిత్తము నన్యాయత్త మొనర్చు ప్రపంచసంబంధము తొలంగి పోవుచున్నది. నిత్యమును గొంతకాలమైనను ధ్యాన మొనర్చుచో నీజీవితమంతయు మార్పుజెందును. ధ్యాననియమ బద్ధమగు జీవితము శాంతియుతము; సౌఖ్యవంతము; ఉన్నత భావపూరితము.

సంకీర్తనము:

ఈ ప్రశాంత సమయమున నాచిత్తము
నిన్నుస్మరియించునుగాక !
నే నా ప్రభుని కృపాసముద్రమున నీదులాడుదును గాక !
ఆమహానుభావుడే నన్ను రక్షించి
చేదోడు వాదోడై యుండునుగాక !
నాసమస్తమును ఆయన కర్పించి ఆయనలో
నైక్యమైపోవుదును గాక !

స్వామిరామతీర్థ.

---

# ఆంధ్రరాష్ట్రం ఎప్పుడు?

(బాలరాజు సినిమాలోని "తీయని వెన్నెలరేయి" అనుపాటవరుస)

బహుమిక్కిలి సొంపగు దేశం
మన కెంతో యింపగు దేశం
ఆం... ... ...ధ్రదేశం
కనుటకే అందంబా॥ బ॥

త్రిలింగ మధ్యాలెల్ల
ముక్కోటి ఆంధ్రులెల్ల
ఆంధ్రరాష్ట్రమునకై పోరాడు చుండంగ
ఇచ్చుటకే సంశయమా!
విడదీయుటయే శ్రేయంబా॥ బ॥ 1

జేబులోను యున్న
మన జేబులోను యున్న
ఆంధ్రరాష్ట్రప్రాప్తికై ఆమోద మొందండీ
కనుటకే రమణీయం
కాంచుటకే ఆదర్శం॥ బ॥ 2

స్వామీ సీతరామా
ప్రజలనంతా ఐక్యపరచి
ఆంధ్రరాష్ట్రము సాధింప ఆశతోనున్నాడు
ప్రజలంతా... ...ఎలుగెత్తి
చాటండీ రాష్ట్రంబు॥ బ॥ 3

ముక్కోటి ప్రజలుగూడి త్వరలో ఐక్యమైతే
ఆంధ్రరాష్ట్ర అవతరణం ప్రజలంతా
చూస్తారు
కనుటకే శుభప్రదమూ
కాంచుటకే శోభనమూ॥ బ॥ 4

రచన: "ఎన్. కె."

# ఎయిడెడ్ ఉపాధ్యాయులకు శస్త్రచికిత్స

## కాకరపర్తి కామేశ్వరశాస్త్రి, బేసిక్ టీచర్; ఖండవిల్లి

"పోషక పాఠశాలోపాధ్యాయుడు (Aided school Teacher) అను పేరు వినబడుసరికి, అతడు ప్రభుత్వమువారి నిరంకుశచట్టములతోను, మేనేజర్ల కఠినచర్యలతోను, పీడింపబడుచు, ఏ విధమైన పలుకుబడి (రాజకీయముగ) ధనము లేనివాడై యీ వ్యక్తిగత యాజమాన్య పాఠశాలలో పనిచేయువాడని తలంపబడుచున్నాడు.

ఈ యాజమాన్యములలో, మేనేజర్లు వుపాధ్యాయులను పీడించుట, వారిని చీకాకుపరచుట తమ నిరంకుశత్వమును విచ్చలవిడిగా అమలుపరచుట, మొదలగు విషయములు వుపాధ్యాయ సోదరులకు తెలియనివికావు.

ఐతే ఇటీవల ప్రభుత్వమువారు, తామిచ్చు వేతనములతో వుపాధ్యాయులు తెగబలిసి, మత్తెక్కిరని కాబోలు శస్త్రచికిత్సకు గడంగిరి. కాని తామిచ్చు జీతము వుపాధ్యాయులకు దారాపుత్రులతో కడుపు నిండుగ తినుటకు ఒక వారమునకైనను సరిపోదని వీరికి తెలియదుకాబోలు! ఎందరెన్ని చీవాట్లుపెట్టు చున్నను, వేరుగతిలేక సకాలమునకు జీతములురాక, గంజిసత్రముల కెగబ్రాకుచున్న అభాగ్యపు వుపాధ్యాయులస్థితి వీరికి తెలియదు కాబోలు!

1951 సంవత్సరపు గ్రాంట్లలో చాలామంది వుపాధ్యాయులకు 5% వరకు కోతలనిచ్చిరి. మేనేజర్లలోకూడా అధికసంఖ్యాకులకు 10% వరకు కోతలనిచ్చిరి. పోనీ పరీక్షాధికారులు చెడ్డగా రిమార్కులు వ్రాసిన వుపాధ్యాయులకు, మేనేజర్లకు, యిట్టికోత నిచ్చుట సమంజసమే! పరీక్షాధికార్లు బాగుగా రిమార్కులు వ్రాసిన వుపాధ్యాయులకు, పాఠశాలలకుకూడా, యిట్టి కోతలనిచ్చుచు, వుపాధ్యాయుల స్థితికి మొసలుకన్నీరు కార్చుట యేమి ధర్మము?

ఇక మేనేజర్ల స్థితినిమనవిచేసినను, తమగ్రాంట్లు సరిగావచ్చినప్పుడే ఉపాధ్యాయులవద్ద నెల 1 కి రు 2 మొదలు రు 10 వరకు సంగ్రహించుచున్నవీరు తమ సాలుసరిగ్రాంట్లలో పైనచెప్పినవిధముగా నష్టపడినప్పుడుతమనష్టమును ఉపాధ్యాయులద్వారా భర్తీచేసుకొన ప్రయత్నింపరా? దానికితోడు ప్రతి వుపాధ్యాయునికి మేనేజరు తన స్వంతసొమ్ములో నెల 1 కి రు 3 ఈయమని చేసిన అసంబద్ధపు వుత్తర్వులు వుండనేవున్నవి. ఇవికాక అధికారులు, గుమస్తాలు, మొదలగువారిలో లంచగొండితనము, బంధుప్రీతి, నానాటికి మితిమీరుచున్నవి. పనిచేసిన నెల తరువాత మూడునెలలకైనను జీతములీయని ఆచారము యథాతథముగానే యున్నది. ఇన్ని సమస్యలు పెనుభూతములవలె చుట్టుముట్టగా ఆ వుపాధ్యాయుని స్థితినిగూర్చి వేరే చెప్పవలయునా? క్రిందటి సంవత్సరముకూడా యిట్టి అన్యాయము జరుగగా పత్రికలద్వారా మన నిరసనను తెలియబరచియున్నాము. కాని మరల యీ సంవత్సరముకూడా మనస్థితి యథాతథముగానే యున్నది.

ఇది కేవలము వుపాధ్యాయులకై ఖర్చుపెట్టు ద్రవ్యములో కొంత మిగుల్చుటకై వుద్దేశింపబడినదితప్ప వేరుకాదనుటలో అతిశయోక్తి వుండదు. ఐతే ఈ విధముగా బక్కచిక్కిన బడుగు పంతుళ్ళనుండి మిగిల్చినసొమ్ము-వేలాది రూపాయలు జీతాలు తీసుకుంటూ, అంతకు యెన్నోరెట్లు లంచాలవల్ల ఆర్జిస్తూ, అబద్ధపువ్రాతలు వ్రాసి, T. A. గుంజుకొంటున్న వున్నతోద్యోగులకు ఖర్చుపెట్టుట యీ ప్రభుత్వోద్దేశము? ఇట్టిస్థితిలో ప్రాథమిక వుపాధ్యాయులద్వారా విద్యాస్థితిని బాగుపరచ జూచుట బలహీనమైన పునాదిపై బహు భారయుతమైన సౌధము నిర్మింపబూనుటయే కాగలదు; అజాగళ స్తనములనుండి క్షీరముల నాశించుటయే కాగలదు.

కావున నాయకులు, అధికారులు, వుపన్యాసాలు దంచడం కట్టిపెట్టి, వుపాధ్యాయులసమస్యలను పరిష్కరించటానికి పూనుకోడం చాలా అవసరం.

రాజకీయచతురులును, పరిపాలనా దక్షులును, భారతదేశమంతటను పెద్ద పదవిని నిర్వహించిన వారును, చిన్నవుద్యోగులకష్టములను గుర్తించిన వారును, మన ముఖ్యమంత్రిగారును, నగు శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారు విద్యాశాఖలోని వివిధ మేనేజిమెంట్లను రద్దుపరచి, వేతన వ్యత్యాసములను తొలగించి, విద్యాభివృద్ధికి పాటుపడుదురని ఆశిద్దాము. విద్యామంత్రియు అన్నీ తెలిసినవారు కావడంవల్ల మనఆశ సఫలమగుగాక!

# ప్రాథమికోన్నత పాఠశాలలందు హిందీ విద్యాబోధన

శ్రీ K. సిద్ధలింగపిళ్ళ టీచరు
పురపాలక ప్రాథమికోన్నత పాఠశాల - తిరుపతి

మన భారతదేశమునందు హిందీని ప్రభుత్వభాషగా పరిగణించు సూచన లున్నవి. దీని కనుగుణ్యాముగా ప్రతియున్నత పాఠశాలలోను హిందీ విద్యాబోధన I ఫారం మొదలు VI వ. ఫారమువరకు నమలుపఱచియున్నారు.

ప్రాథమికోన్నత పాఠశాలలో చదువువారు చాలమంది నిరుపేదలు, అట్టి ప్రాథమికోన్నత పాఠశాలలలో 6, 7, 8 తరగతులకు హిందీ బోధించు నవకాశము నిచ్చుట మన మదరాసు రాష్ట్రములో లేదు. అట్టితరి మన రాష్ట్రములోని ఉన్నత పాఠశాలలలో మాత్రము I, II, III ఫారముల కట్టి అవకాశము కల్పించియున్నారు. E. S. L. C ప్రభుత్వ పరీక్ష అనగా VIII Standard ఆంగ్లములో ఉత్తీర్ణుడైన తోడనే ఒకవిద్యార్థికి IV వ. ఫారములో ప్రవేశము (Admission) నివ్వవలెనని ప్రభుత్వము వా రనుమతించి యున్నారు. హిందీ పరిచయము లేని E. S. L. C. పరీక్ష నెగ్గిన ఒక విద్యార్థి IV వ. ఫారములో చేరినప్పుడున్నత పాఠశాలలలో మామూలుగా చదువు విద్యార్థులతో హిందీభాషయందు, సమానముగా నుండడు. ఉన్నత పాఠశాలయందలి విద్యార్థులు I. II. III ఫారములలోని సిలబస్సులను పూర్తిచేసి, కొంత హిందీ పరిచయము గావించుకొని యుందురు. అయితే VIII Standard ప్రభుత్వ పరీక్ష ప్యాసయి IV వ. ఫారములో చేరిన ఒక విద్యార్థి క్రొత్తగా హిందీభాష నభ్యసింప మొదలుపెట్టి ఉన్నత పాఠశాలలోని IV వ. ఫారములోని విద్యార్థుల స్టాండర్డును వచ్చుటకు చాల చీకాకు పడుచున్నాడు. ఇదియుగాక చాల కష్టనిష్ఠురములకు లోనగుచున్నాడు.

౧౮౭ వ పేజీ తరువాయి

ఐతే వుపాధ్యాయుల నిమయుంపూడా ఆత్మపరీక్ష చేసుకొందాం, ప్రతిజిల్లాలోను, లోకల్‌బోర్డు వుపాధ్యాయులకు సంఘములున్నవిగాని ఎయిడెడ్ వుపాధ్యాయులకులేవు. కొన్నిచోట్ల ఉన్నను పనిచేయుచున్నట్లు కానరాదు. ఇప్పటికైనా వీటి యావశ్యకతను గమనించి, వెంటనే సంఘములను స్థాపించి, ఇకముందైనను యిట్టి అన్యాయములు జరుగకుండా చూచుకొనవలెను.

పత్రికలుకూడా యీ విషయములను ప్రచురించి ప్రభుత్వమువారి యిట్టి వుత్తర్వులను ఖండించవలెను. “ఈ సమయములో భక్తిపూర్వకంగా, గట్టిగా, దేవుని ప్రార్థిద్దాం. అంతకంటె మనం చేయగలిగింది మాత్రం యేమిటి” అని నిరాశచెందవద్దు సుమండీ! నడుముబిగించి శక్తివంచనలేకుండా కృషిచేయడానికి పూనుకోండి! దేవుడున్నాడు. జయము మనకే.

జైహింద్.

# ప్రావిడెంటు ఫండు రూల్సు

(1952 సెప్టెంబరు నెల తరువాయి)

తర్జుమాదారు : కొండ్రెడ్డి సూర్యప్రకాశం

## అనుబంధము 'ఎ' (అప్పెన్డిక్సు 'ఎ')

పింఛణీలేని సర్వీసులో పనిచేయు ఉపాధ్యాయులు ప్రావిడెంటుఫండులో చేరుటకు దరఖాస్తు ఫారము:—

1. చందాదారుని పూర్తిపేరు
2. తండ్రిపేరు
3. పుట్టినతేదీ
4. జనరల్ విద్యాయోగ్యతలు (ప్యాసయినతరగతి)
5. వృత్తిసంబంధమగు విద్యార్హతలు (ప్యాసయిన ట్రయినింగుపరీక్ష)
6. ప్రస్తుతం అతడు లేక ఆమె పనిచేయుచున్నపాఠశాల పేరు.
7. పనిచేయుచున్న ఉద్యోగము యొక్క హోదా.
8. ఆపాఠశాలలో ప్రవేశించిన తేదీ
9. ప్రస్తుతం తీసుకొనుచున్న నెలజీతం.

చందాదారుని సంతకం.

---

౧౮౭ వ పేజీ తరువాయి

అట్టి చీకాకు పోగొట్టుటకు ప్రభుత్వమువారు కనికరించి ఉన్నత పాఠశాలలలో I. II. III ఫారములకుండు హిందీ ప్రణాళికను ప్రాథమికోన్నత పాఠశాలలలోని 6, 7, 8 తరగతులకు కూడ నిర్ణయించి, అట్టి విద్య నభ్యసించు నవకాశము ప్రాథమికోన్నత పాఠశాలలందుగల పేదవిద్యార్థులకు కల్పించ ప్రార్థించుచున్నాను. ఇట్లు గావించినచో ప్రాథమికోన్నత పాఠశాలలో VIII Std ప్యాసైయి IV వ. ఫారములో అడ్మిషన్ పొందు విద్యార్థులకు చీకాకు పొందు నవకాశముండదు.

ప్రభుత్వము నిర్వహించు ప్రాథమికోన్నత పాఠశాలలలో హిందీ విద్యాబోధన నమలు జరుపుటయేగాక అట్టిబోధన ఆవశ్యకమైయుండి, ఇతర అన్ని సంస్థలచే నిర్వహింపబడు ప్రాథమికోన్నత పాఠశాలలందు 1953-54 సం॥ రం నమలు జరుపవలయునని ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నాను.

ఈ అభిప్రాయముతో ఏకీభవించి, విద్యార్థిలోకమున కనువుగా ప్రతి ప్రాథమికోన్నత పాఠశాలోపాధ్యాయులును వారి సెంటరుక్లాసుద్వారా అట్టి విద్య ఆవశ్యకమని సభా తీర్మానముల మూలమున ప్రభుత్వమువారి కందజేయ ప్రార్థించెదను.

---

## ధ్రువపత్రిక

....................అను పేరుగల నేను, యిందుమూలముగా ధ్రువపఱచునది యేమనగా నాకు తెలిసినంతవరకు పైనమూదులన్నియు సరిగా నున్నవనియు, ప్రభుత్వమువారివలనఆమోదింపబడిన స్కూళ్ళ విషయములో గవర్నమెంటు యేర్పరచిన పింఛనీలేని సర్వీసులో పనిచేయు ఉపాధ్యాయులకు సంబంధించిన ప్రావిడెండుఫండు నిబంధనలకు నేను లోబడియుందుననియు, మరిన్ని, ఫండులాభములు పొందుటకు నేను ప్రవేశించినయెడల, వానికి లోబడియుందుననియు, నేను ఒప్పుదల అగుచున్నానని యిందుమూలముగా ధ్రువపఱచుచున్నాను.

నేను ఫండు చెల్లించుటకు చేరినయెడల, నాఅక్కౌంటు అమలులో నుండగా, నాకు మరణము తటస్థించినయెడల, ఫండుబాపతు నాకు నిల్వయున్నంతవరకు గల మొత్తమును, అనగా తపాలాకచేరీ నిలవ కోశాగారములో నాబాకీక్రింద తేల్చబడే నిల్వమొత్తమున్నూ, నాకు ప్రభుత్వమువారిచ్చే కంట్రిబ్యూషను సొమ్మున్నూ, యీదిగువవారికి చెల్లించబడుటకు నేను కోరి అంగీకరించుచున్నాను.

(ఏ) వితంతువు లేక వితంతువులు, బిడ్డ లేక బిడ్డలు, నా తర్వాత బ్రతికియున్నచో యీదిగువ 1 వ షెడ్యూలులో చెప్పబడిన ప్రకారము, అట్టి ఒకరికిగాని, అంతకు ఎక్కువమందికిగాని, అతని లేక వారిపేర్లకు ఎదురుగా వ్రాసిన ప్రకారమున్నూ, మరిన్ని

(బి) నా అనంతరము, వితంతువు లేక బిడ్డ ఎవరును నాకు లేనియెడల, యీదిగువ 2 వ షెడ్యూలులో చెప్పబడిన వ్యక్తి లేక వ్యక్తులకు, వాని లేక వారిపేళ్ళ కెదురుగా చెప్పినవిధమునయున్నూ, చెల్లించబడవలెను.

నేను మరణించుసమయమునకు ఫండు చెల్లింపబడవలసిన వ్యక్తి మైనరు అయినచో షెడ్యూలు 1 లేక 2 లో 5 వ కలములో కనబడు పేరుగలవారికి, ఆఫండుసొమ్ము చెల్లింపబడవలెను.

గమనిక:—12 వ నిబంధన 'సి' క్లాజు ప్రకారము వితంతువుకు సొమ్ము చెల్లింపనక్కరలేనియెడల, తర్వాత వారసుబిడ్డలేక మరియొక వితంతువు లేనపుడు షెడ్యూలు 2 లో వ్రాసినప్రకారము ఆ సొమ్ము పంచిపెట్టవచ్చును.

### షెడ్యూలు 1

**అనంతరం:—వితంతువు (లు) లేక బిడ్డ (లు) ఉన్నప్పుడు పంచిపెట్టవలసిన విధానము.**

| నామినీలేక నామినీల (అనగాసొమ్ము చెల్లింపబడు వారియొక్క) పేర్లు చిరునామాలు. | చందాదారుకు గల చుట్టరికము. | మేజరా? మైనరా? మైనరు అయినచో వయస్సు | చెల్లించవలసిన సొమ్ము; లేక ఎన్నవ భాగము. | సొమ్ము చెల్లింపబడవలసిన వ్యక్తి మైనరు అయినచో ఆ సొమ్ము ఎవరికిచెల్లింపబడవలెనో వారి పేరు విలాసము. | 1వ కలములో చెప్పబడిన వారు పురుషుడా? స్త్రీయా? తండ్రిపేరు ఎవరు? |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| | | | | | |

## షెడ్యూలు 2

అనంతరం, భార్య, బిడ్డలు, లేనపుడు పంచిపెట్టవలసిన విధానం.

| నామినీ లేక నామినీల పేర్లు చిరునామాలు. (సొమ్ము ఎవరికి చెల్లింప బడవలెనో అట్టి వారి) పేర్లు. | ఏదైనాఉన్న యెడల-చందా దారుకు గల చుట్టరికము | మేజరా? మైనరా? మైనరు వయస్సు | డిపోజిట్టు మొత్తం సొమ్మా? లేక కొంత భాగమా? ఎంత? | మైనరు తరపున సొమ్ము ఎవరికి చెల్లించ వలెనో వారి పూర్తి పేరున్నా? అడ్రసున్నా? | 5వ కలములో చెప్పబడిన వ్యక్తి స్త్రీయా? పురుషుడా? ఆవ్యక్తితండ్రి పేరు. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| | | | | | |

స్టేషను
తేదీ ఇద్దరు సాక్షుల సంతకం. చందాదారుసంతకము.

సాక్షుల తండ్రుల పేర్లు - కులము, వృత్తి, గ్రామము, పోస్టు, తాలూకా, జిల్లా.

పాఠశాలయజమాని లేక కరస్పాండెంటుచే, యివ్వబడవలసిన సర్టిఫికెట్:—పైన వ్రాయబడిన దరఖాస్తులోని 9 వ కలములో చూపబడిన జీతము సరిగానున్నదని నేను యిందుమూలముగా సర్టిఫై చేయుచున్నాను.

## అప్పెన్డిక్సు 'బి' (అనుబంధము 'బి')

పేరు.
పుట్టిన తేది
ఫండు చెల్లించుటకు ప్రారంభించిన తేదీ
సర్వీసుతబిసీళ్ళు, జీతమురేట్లు, కంట్రిబ్యూషనులు, చెల్లించిన కాలములు:—

| ఉద్యోగంలో చేరి పనిచేయుచున్న పాఠశాల పేరు | పనిచేసే ఉద్యోగములోని హోదా | జీతము రేటు నెల 1 కి ఎంత ? | కంట్రిబ్యూషను చెల్లింపబడిన కాలము | | ఎప్పటి నుంచి ఎప్పటి వరకుకంట్రిబ్యూషను చెల్లింప బడలేదో ఆ కాలముల వివరములు -అందుకు గల కారణములు | జిల్లా విద్యా శాఖాధికారి లేక స్కూలు కరస్పాండెంటు యొక్క ఆటెస్టేషను |
|---|---|---|---|---|---|---|
| | | | ఏ తేది నుంచి | ఏ తేదీ ఆఖరుకు | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| | | | | | | |




# ౧. సమీక్ష

కొడుకుల సోమేశ్వరరావు - మానేజరు.
శ్రీ నివాస ఎయిడెడ్ పాఠశాల - అమలాపురం

ఆర్యా!

ప్రాథమిక విద్యాప్రదానము ప్రభుత్వపు కనీస ధర్మము. ఇది తిండిబట్టకంటె అవసరమని అందరు గుర్తెరింగినదే. దీనికి ప్రభుత్వము గట్టిగా పూనుకొన వలయును. విద్య ప్రజలకు లేకుండిన ఏవిధమైన పురోగమనము కలుగజాలదు. విద్యలేని జాతి చేతిలోని ఓటు గ్రుడ్డివాని చేతిరాయి వంటిది. కావున ప్రభుత్వము దీనికి సరియగు మార్గమును త్రొక్కకున్న అన్ని విధముల అవరోధమే.

ఉపాధ్యాయులకు తగువేతనములు లేనిదే పని చేయుట దుస్తరము. అందువల్లనే విద్యాభివృద్ధి మందగతిని నడచుచున్నది.

ఈ సంవత్సరము బడ్జెట్టులో ధనాభావముండినను కొన్ని ముఖ్యమైన మార్పులు వెంటనే చేయ పూనుకొనిన కొంత వరకైన మేలు జరిగెడిది.

ప్రాథమిక ఉపాధ్యాయులకు జీతములు చాలనివైనను వానిజీవిత హైన్యమును మాన్పప్రభుత్వము వెంటనే పూనుకొనవచ్చును. సెకండరీ స్కూళ్లకు పిల్లలు హెచ్చుగుటకును, నిర్బంధ ప్రాథమిక విద్యకు ఎంత ఖర్చుపెట్టినను పిల్లలగైరు హాజరు నకును, కారణమేమి ?

(1) నిర్బంధప్రాథమిక విద్యాశాసనములు మద్యపాన నిషేధమువలె చాలవరకు ఉన్నతస్థితిని అందుకొనక పోవుటకు కారణము తల్లిదండ్రులకు చాలమందికి

౧౬౧ వ పేజీ తరువాయి

గమనిక:—(1) జిల్లా విద్యాశాఖాధికార్లు (బాలికాపాఠశాలల విషయములో పరీక్షాధికారిణులు) ప్రతిజిల్లాలోని, ప్రతితాలూకాలోని, స్కూళ్లకువేరుగాను, ప్రతిమ్యునిసిపాలిటీలోని స్కూళ్లకువేరుగాను, వేరువేరు రిజష్టర్లు నియమించవలెను.

(2) 1 నుండి 4 వరకు గల కలములు వెంటనే పూర్తిచేయవలెను, గాని 5 నుండి 7 వరకు గల కలములు, హోదాలోగాని, జీతముపెరిగినపుడు లేక తరిగినపుడుగాని, ఒకస్కూలునుండి మరియొకస్కూలుకు మారినప్పుడుగాని, పూర్తిచేయబడవలెను. మరిన్ని అటువంటి పరిస్థితులలో 1, 2, 3, 4, కలములు గూడ తిరిగి క్రొత్తగా నింపబడవలెను.

(3) చందాదారు సెలవులోనుండుట వలనగాని, ఉద్యోగంలో లేకపోవుట, మొదలగు కారణముల వలనగాని, చందా చెల్లించక పోయినపుడు, కలుగుకాలములకు ఆఖరికలములో కారణములతోసహా బహు క్లుప్తముగా వ్రాయబడవలెను.

షరా:—గెజెట్టు ప్రకటనలు - విద్యాశాఖ - మదరాసు విద్యానిబంధనలలోని మార్పులు పెన్షను యివ్వబడని సర్వీసులోగల ఉపాధ్యాయుల, టి.పి.యఫ్‌కు సంబంధించిన నిబంధనలలోని దరిమిలాసవరణలు

14-7-52 తేదీగల ఎడ్యుకేషన్ (జి. ఒ.) ప్రభుత్వఉత్తరువు నెం 1607 రు ప్రకారం, యీ దిగువ మార్పులు చేయబడినవి.

మార్పు:—చెప్పబడిన నిబంధనలలో:—

టి. పి. యఫ్ రూల్సులో 2 వ నిబంధన సబురూలు 'ఎ' లో "లేక తన కుటుంబములోని ఒక వ్యక్తిగాని" అనుమాటల తర్వాతను "వివాహ సందర్భముల కయ్యేడు ఖర్చుల నిమిత్తం చెల్లించుటకు" అను మాటలకు ముందుగాను, యీదిగువమాటలు చేర్చబడవలెను. "లేక నిజముగా చందాదారు మీద ఆధారపడియుండు ఒక వ్యక్తిగాని"

(సశేషము రానున్న పత్రికలో)

విద్యవల్లలాభములు తెలియకపోవుటయే. దానికి ముఖ్యమైన మందు వయోజన విద్యాప్రచారము; వయోజన విద్య.

(2) సెకండరీ విద్యావిధానమును అనుసరించి యింకను ఎక్కువయినను, ప్రాథమిక విద్యకు, దానికి, సంబంధము ప్రభుత్వము గుర్తించకపోవుట – అనగా ప్రాథమిక పాఠశాలలో 5 వ తరగతి ఉత్తీర్ణుడై (Recond Shut) ఉన్నను మాధ్యమిక ఉన్నత పాఠశాలలలో ప్రవేశము లేకపోవుటయే రికార్డుషీటులేని 3 వ తరగతి విద్యార్థి, 5 వ తరగతి ఉత్తీర్ణుడైన విద్యార్థికి, ఒకేపరీక్షకు ప్రయివేటుగా కూర్చుండి ఎట్లో యిద్దరు ఉత్తీర్ణులగుటచే ప్రాథమిక పాఠశాలలలో పిల్లలు ఉండకపోవుటయు, ఉన్నత పాఠశాలా విద్యార్థులకు పునాదులు లేకపోవుటయు, జరుగుచున్నది. అట్లని ప్రయివేటు పరీక్షలు మానమనుటకాదు. 5 వ తరగతి ప్యాసు రికార్డుషీటు ఆధారముపై 1 వ ఫారములో చేర్చుకొనిన సామరస్యముండును – నిర్బంధ ఉచిత ప్రాథమిక సెంటరులలో ఎక్కడను చేరని వారు కొలది మందియుండగా వందలకొలది ఆసెంటర్లలో ప్రయివేటు విద్యార్థులు ఎట్లు వత్తురు. దీనికి ఆపాఠశాల ప్రధానోపాధ్యాయులకు, ఈప్రాథమిక పాఠశాలో పాధ్యాయులకు, సంబంధములేక పోవుటయు, ఈ ప్రాథమిక పాఠశాలా పరీక్షాధికారులకు, వారికి, సన్నిహిత సంబంధము లేకపోవుటయు, కారణము లగుచున్నవి. మరియు ఏయితర ఉపాధ్యాయునకు లేని నిర్బంధము పిల్లలను హాజరు పరచుకొను బాధ్యత ప్రాథమికోపాధ్యాయుని నెత్తిపై నుండుటయే వానిహైన్యమునకు ముఖ్యకారణము. దీని వలన ఆయుపాధ్యాయునకు ఇటువైపున నూయి, అటువైపుగోయి. ఉపాధ్యాయుడు పిల్లలకొరకు యింటికివెళ్లగా పిల్లలకు అవిద్యావంతులగు తల్లిదండ్రులకు, ఆఉపాధ్యాయుడుచులకనయే. కొన్నిచోట్ల అతడు పొందు గౌరవము చూచిన, వినిన, మనదేశ దౌర్భాగ్యమేమన వచ్చునో చెప్పజాలము. వారు ఒకప్పుడు "మానుండియే మీకు జీతములు వచ్చుచున్నవి. మాయిష్టము వచ్చినప్పుడు వచ్చెదము – ఊరకుండి; కావలసివస్తే ఆఫీసర్లు వచ్చినప్పుడు కబురుపంపిన వచ్చెదము, పంపుతాము" అని పెద్దలు చెప్పుదురు. ఎందుచేత? పిల్లలను కూడగట్టుకోమని ఆజ్ఞయే. రికార్డుషీటు విలువలేక పోవుటయే. ఇవి తొలగించిన కొంతవరకు ఉపాధ్యాయునికి కొంతగౌరవము, పాఠములు చెప్పుకొనుటకు కాలము, వచ్చును.

మీరు ఖర్చుపెట్టు ధనము సార్థకమగుటకు కొంత కాల పరిమితిలోపల ఓటర్లందరు 5 వ తరగతినైన పూర్తి జేయవలెనన్న వయోజన విద్యపాఠశాలల లోను, ప్రాథమిక పాఠశాలలలోను, కావలసినంత మంది విద్యార్థులు ఉందురు. దేశము విద్యావంతమగును. అనుభవజ్ఞులగు ఉపాధ్యాయులే ప్రాథమిక పాఠశాలా ప్రణాళిక తయారు చేసిన కొంత బాగుండును. అట్టిఅవకాశము వారికి ప్రభుత్వము కలుగజేసిన చాల బాగుండెడిది. పాఠ్యగ్రంథముల నిర్ణాయక కమిటీయందును, వివిధమేనేజిమెంట్లకు చెందిన అనుభవజ్ఞులగు ఉపాధ్యాయులుండి సకాలమునకు ప్రచురణజరుగ వలయును. మేనేజిమెంట్లు సకాలములోనే అనగా బడితెరచిన వారములోపుగనే పాఠ్యగ్రంథములను నియామము జరుగవలెనని కఠినమైన ఉత్తరువులు యిచ్చుట చేసిన బాగుండును. ఉదాహరణకు మా జిల్లాబోర్డు పాఠశాలలు తెరచి చాల కాలమైనను నిన్నటి వరకును పుస్తకములు ఏమికొనిపించ వద్దనియే ఉత్తరువు. ఇంత వరకు ఏపాఠములు జరుగును? అమెరికన్ మిషన్ సొమ్ము చాలమట్టుకు బడులకు ఏపైన వస్తురూపముగా కొని యిచ్చిన చాల బాగుండెడిది.

నిర్బంధ విద్యాసెంటరులలో అద్దెనిత్తుమని పాఠశాలలు పెట్టించి, పనిజరుగుచుండగా కొంత కాలమైన పిమ్మట యివ్వమనుట పాఠశాలా నిర్వాహకులకు నిరుత్సాహము కలిగించుటయే కాన పూర్వపు సూత్రములపై వారికి అద్దెలిచ్చుటకు ప్రభుత్వము పూను కొనిన బాగుండును.

## ౨. నిరాశా పూరితమైన మద్రాసు ప్రభుత్వపు విద్యాశాఖ బడ్జెట్టు – ఉపాధ్యాయుల కర్తవ్యం

అఖండప్రజ్ఞా ధురంధరులైన శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులవారి మంత్రివర్గము వచ్చుటచే ఉపాధ్యాయులు తమకు మేలుకలుగునని ఆశించిరి. కాని బడ్జెట్టు అంచనాలో ఉపాధ్యా

# * * * పంతుళ్ళ వేదన * * *

రచన : బి. పి. రామచంద్రారెడ్డి

[లోకమంతా లోభులా - మాదిరి]

పంతు లంతటి పతితుడా?
పస్తుతే ప్రాప్తించె పాపము!
పరికింపుడీ పంతుళ్ళపాట్లను
పోషింపుడీ ప్రాజ్ఞవరులను!
పాఠశాలలో పిల్లవాండ్రను
పోగుచేసి పట్టుదలతో
ప్రొద్దుగూకులు పఠింపజేసె
పండితులకు ఫట్టమేదీ!
ప్రపంచ మెఱుఁగని పసిపాపలకు
ప్రబోధమును పట్టించెడు
పునీతుడు పంతులు పాక లేక
పరితపించుట పాడియగునా?

పల్లెసీమల పురోభివృద్ధికై
పురోగమించెడు ప్రబుద్ధులను
పురజన ప్రస్తుతి పొందినపంతుల్ని
పరిక్లేశములు పరివేష్టించెగా!
ప్రాలుమాలక పరాయణతతో
పిల్లలందలి పొల్లుదనముల
పాఱద్రోలి పటిమపఱచు
పేదపంతుల పాటిగొనరా?
పట్టుపట్టున పదిరోజులకే
పటాపంచలగు పడపుతోడ
పారణచేయు పరికట్టెలను
పరిపోషింపుడు పాలకుల్లారా!

---

౧౫౩ వ పేజీ తరువాయి

యుల ఆశలన్నియూ నిరాశలైనాయి.

ప్రస్తుతపు బడ్జెటులో సుమారు 9 కోట్లు విద్యకు కేటాయించ బడినది. దానిలో చిల్లిగవ్వకూడా ఉపాధ్యాయుల స్కేల్సు పెంపుకు చూపబడలేదు. విద్యాశాఖా డిమాండు చర్చలలో పలువురు శాసన సభ్యులు దీనినిగూర్చి తమనిరసనను తెలియజేసినారు, వారికి నా ధన్యవాదాలు.

తక్కువజీతాలలో బాధపడువారికి జీతములు పెంచుటనుగురించి శ్రీరాజాజీగారు మాట్లాడుతూ జీతములు పెంచినయెడల సినిమాలకు, సిగరెట్లుకు పాడుచేయుదురని వారి ఉద్దేశమైనట్లు నుడివిరి. సినిమాలు విజ్ఞానాభివృద్ధిని కలుగజేయునవిగా నేడురూపొందించ బడినవి, నాగరికత నానాటికి వృద్ధిచెందుచున్నది.

దేశము విజ్ఞానాభివృద్ధితో ముందుకుపోవుటకు శ్రీమాన్ ఆచార్యులవారికి ఎంత అభిమానమున్నదో వారు నుడివిన వాక్కులే ఋజువుచేయును.

మానవుడు ఆది యుగములో వలెనే పచ్చిమాంసమును తిని ఆకులుకట్టుకొని, అనాగరికుడైయున్నట్లు, ఇప్పుడుకూడా ఎందులకు ఉండరాదని రాజాజీగారి ఉద్దేశముకాబోలు!

రాజనీతి చతురతలో గొప్పవారని పేరుగడించిన శ్రీమాన్ ఆచార్యులవారే ఉపాధ్యాయుల యెడ ఇట్లుప్రవర్తించుట వారిబిరుదమునకు తగదేమోనని నా భావము.

ప్రభుత్వము అవలంబించుచున్న విధానానికై సోదరులందరు తిలకించి, నిత్యము మనహక్కులన్ని పోరాడు ఉపాధ్యాయ ఫెడరేషన్ ద్వారా కనీసము సెంట్రల్ పేకమీషన్ సిఫార్సులనైనా మన ప్రభుత్వము అమలుజరుపు దాక తీవ్రముగా ఆందోళన చేయవలెను,

ప్రతిప్రాథమికోపాధ్యాయుడును కార్యకర్తలను సంస్థకు, తగినబలముచే కూర్చుటకు ముందడుగువేసినయెడల జయమొంద గలుగుదుమని యీలేఖ ద్వారా మనవిచేయుచున్నాను.

మీ సోదరుడు,
మందలపు వీరరాఘవయ్య,
ప్రాథమికోపాధ్యాయుడు
పంచాయితీపాఠశాల—(జలపవారిగూడెం)

# ప్రాథమిక విద్య - సినిమా ఫిల్ములు

విద్యావిషయములో అనుసరించే విధానాల్లో "చిత్రాలు-వాటిప్రదర్శన" ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకొన్నాయి. మనం బోధించే విద్యావిధానం కేవలం సిద్ధాంతాలతోనే నిండినందువల్ల, మనబాలబాలికలకు అర్థమైనాకూడ దీర్ఘ కాలంమనడం లేదు. బాలమనస్తత్వానుసారం సామాన్యంగా విద్యార్థులకు, ఎన్నోవిషయాలు తెలుసుకోవలెనే సహజకుతూహలం వుంటుంది. ఆదశలోనే అనేకవిషయాలపై సందేహాలు సహితం కలుగుతూ వుంటవి. వీటి నివృత్తికి సినిమా - ఫిల్ములు ముఖ్యసాధనాలు.

మనంబోధించినవిద్య కేవలం శ్రవణేంద్రియాలద్వారా గ్రహించి, త్వరలో మరచి పోవడానికి వీలుంది. కంటితో గ్రహించిన విద్యదీర్ఘకాలం జ్ఞప్తి వుండడమేకాక, సులభంగాను, సుబోధకంగాను, అర్థమౌతుంది. అందుచేత మనప్రాథమికపాఠశాలల యందుకూడ, కంటితో ప్రత్యక్షంగా చూచేందుకు, గ్రహించేందుకు, ప్రత్యేక విద్యావిషయక చిత్రాలు అత్యావసరము.

ఎలిమెంటరీ స్కూళ్ళ పాఠ్యప్రణాళిక లోని కఠిన తరవిషయాలపై చిన్నచిన్న ఫిల్ములను తయారుచేయించి, ప్రదర్శించడం అవసరం. ఉదాహరణకు:— అక్షరములు పదములు, వాక్యములు, సిగ్గోబాలుడు, తంజావూరుబాలుడు, వారిజీవిత విధానము, నాయకుల జీవిత విశేషాలు, వివిధ జంతువులు, పక్షులు, ప్రకృతి సౌందర్యదృశ్యాలు స్థానికచరిత్రాంశములు, హైందవ సంస్కృతికి అనుగుణమైన విషయాలు, మున్నగునవి చేర్చి, కొన్ని ప్రత్యేక ఫిల్ములను తయారు చేయించి, ప్రదర్శించడం ఉచితం. ఈచిత్రములద్వారా మనబిడ్డలు అనేక విషయాలు ఆనందముతోను ఆశ్చర్యముతోను, విసుగు విరామము లేకుండా చూచి నేర్చుకొంటారు. వీటిద్వారా అమూల్యమైన జ్ఞానమువారికి కలుగుతుంది. ఇందునిమిత్తం ప్రభుత్వానికి అమిత ధన వ్యయ మైనను చింత లేదు. భావిసంపదయగు మన బిడ్డలసర్వతోముఖాభివృద్ధికి యెంత వ్యయ మయితేనేమి?

మనరాష్ట్ర ప్రభుత్వం గతనాలుగేండుగా సెకండరీవిద్యా విధానములో, దృశ్యవిద్యా ప్రణాళికను చేర్చి అక్కడక్కడ మచ్చుకు కొంతకాలం ప్రదర్శించింది. యేలనో తిరిగి ఈ మధ్య విరమించింది.

ఇంగ్లండు, అమెరికా, రష్యా మున్నగు పాశ్చాత్య దేశాల విద్యావిధానములో విద్యావిషయక చిత్రాలు, డాక్యుమెంటరీ రీల్సు, ప్రముఖపాత్ర వహిస్తున్నాయ్. పాఠ్యపుస్తకాల్లోని (Text-Books) పాఠాలు విద్యార్థులకు సులభ గ్రాహ్యమయ్యేటట్లు "ఫిల్ములను" తీసి ప్రదర్శిస్తూవున్నారు. ప్రారంభ తరగతులో కూడ మాటలు ఎలాఉచ్చరించవలెనో తెలియజేసేచిత్రాలు కూడ చూపబడుచున్నవి, ఆఖరుకు ఒక్కమాటలో చెప్పవలెనంటే ఆదేశాల్లో బాలమనస్తత్వాన్ని బట్టి (Child Nature) చిత్రాల్ని నిర్మిస్తారు. ఈ చిత్రాలే మును ముందు బాలబాలికలు వీరులుగాను, వీరమాతలుగాను, ఆవిర్భవించేందుకు దోహదం చేస్తున్నాయి.

# ప ద పూ ర ణ ము

విద్యార్థులకు మాత్రమే. ఈ పదములను పూరించి పంపునట్టి విద్యార్థులు మా పత్రికకు చందాదారులు కానిచో విధిగా రెండుఅణాల తపాలా బిళ్ళలు పంపవలెను. లేకున్న వారిపేర్లు ప్రకటింపబడవు.

| పదము | అర్థము |
| --- | --- |
| పా — — ము | క్షీరాన్నము |
| పా — — ము | పాపము |
| పా — — ము | వెల్లపునీరు |
| పా — — ము | పవిత్రము |
| పా — — ము | ఒకలోకము |
| పా — — ము | రోగము |
| పా — — ము | ఒకపక్షి |
| పా — — ము | చెట్టు |

కూర్పరి అరిగెల సత్యనారాయణమూర్తి గంగలకుర్రు.

---

౧౪౪ వ పేజీ తరువాయి

కాన మనప్రభుత్వంకూడ అటు విద్యార్థులకు, ఇటు పంతుళ్ళకు, సరిపోయే చిత్రాలను నిర్మించేందుకు సినిమా ప్రొడ్యూసర్లను, డైరెక్టర్లను ప్రోత్సహిస్తూ అవసరమైతే స్వయంగానైనా పూనుకొనేందుకు ప్రయత్నించాలి. భావిసంపదయగు మన బిడ్డల బహుముఖాభివృద్ధికై మనప్రభుత్వం యెంత ధనవ్యయమైనను సరకు గొనక, విద్యారంగములో ముందంజవేసి, ఒక నూతన అధ్యాయాన్ని సృష్టిస్తుందని ఆశిస్తూ ప్రస్నాను. "జై భారత్"

రచన : శీలా వెంకటప్ప, టీచరు, కమలాపురం.

# ఆంధ్రరాష్ట్ర ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు టీచర్ల, టీచర్ల - మేనేజర్ల, మహాసభలు — గుంటూరు.

జరుగు తేది:— ఈ అక్టోబరు నెలలో - విద్యాశాఖామంత్రిగారు తేదీని తెలిపిన వెంటనే పత్రికలలో ప్రకటింపబడును.

సోదరీ, సోదరోపాధ్యాయులారా !

ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు టీచర్ల, టీచరు - మేనేజర్ల స్థితిని చక్కబరచుకొనుటకై మనము మన రాష్ట్ర మహాసభల తరఫున చేయుచున్న కృషి తమకెల్లరకు విదితమే. ది 31-8-52 న గౌ, విద్యాశాఖామంత్రి డా॥ M. V. కృష్ణారావుగారు విజయవాడకు వచ్చిన సందర్భమున మన రాష్ట్ర మహాసభల తరఫున ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు టీచర్ల, టీచరు - మేనేజర్ల కష్టములను తెలియ పరచుచూ, ఒక మెమోరాండమును శ్రీ మంత్రిగారికి సమర్పించితిమి. అందు ముఖ్యముగా (1) మన స్కూళ్ళలో 5 వ. తరగతి ప్యాసైన విద్యార్థులను ప్రవేశ పరీక్ష లేకుండ హైస్కూళ్ళలో I. ఫారములో చేర్చుకోవలెననియు, (2) గ్రాంటుస్కూలు టీచర్లపై జరిమానాలు విధించు పద్ధతిని రద్దు చేయాలనియు, (3) ఎయిడెడ్ టీచర్లకు అదనపు వేతనము రూ 3 ప్రభుత్వమే ఇవ్వవలయుననియు, (4) బడిఖర్చులకగు పూర్తి మొత్తములను ఎట్టి కోతలు లేకుండా మేనేజర్లకు నియ్యవలయుననియు, (5) గవర్నమెంటు స్కూళ్ళ లోని టీచర్ల జీతాలతో సమానముగా నయిన ఎయిడెడ్ టీచర్ల జీతాలను ప్రస్తుతానికి పెంచాలనియు, తెలియపరచితిమి. గౌ॥ మంత్రిగారు సావధానముగా విని, అవసరమగు సహాయమును వెంటనే చేయుదు నని, సమాధానమిచ్చిరి.

పై రాష్ట్రమహాసభలకు ప్రారంభకులుగా నుండవలసినదని మేము గౌ॥ మంత్రిగారిని కోరగా వారు దయతో నంగీకరించుచూ, వారికి వీలగుతేదిని మాకు తెలుపుదుమనియు, ఆ తేదిలలో మహాసభలను జరుపుకొనవచ్చుననియు, సలహానిచ్చిరి. సదరు తేది మాకు తెలుపబడగానే మహాసభల తేదీలు వివరాలు, దిన పత్రికలయందు ప్రకటింపబడును.

కాన ఎయిడెడ్ స్కూళ్ళ టీచరు మేనేజర్లు, టీచర్లు, యీ సదవకాశమును జారవిడువవలదని మా హెచ్చరిక. టీచరు - మేనేజర్లు, టీచర్లు, వారివారి సంఘాలు, సెంటరుక్లాసు సంఘాలు, తమతీర్మాన ములను, డెలిగేట్ల జాబితాలను, రుసుముతో సహా మాకు వెంటనే బంపుచు మహాసభలకు హాజరై మాకు సర్వవిధాల తోడ్పడ ప్రార్థన. ఉపాధ్యాయులు ప్రజలనుండి కూడా మహాసభలకు విరాళములను, వసూలు చేసి, మాకు పంపగోరెదము.

డెలిగేటు రుసుము రూ 12 డెలిగేట్లకు తీర్మానంపై చర్చించు హక్కుండును.

ఇట్లు,

గుంటూరు,
1—9—52.

కొత్తపల్లి సీతారామయ్య,
K. V. శ్రీనివాసరావు కన్వీనర్లు.

వివరములకు

కొత్తపల్లి సీతారామయ్య
R. అగ్రహారము గుంటూరు.

**N. B:—** సెంటరుక్లాసు సెక్రటరీలు, హెడ్మాష్టర్లు, ఈ అంశములను తమ ప్రాంతములందలి ఉపాధ్యాయ సోదరులకెల్లరకు, వెంటనే తెలుపకోరుతాము.

# ఆంధ్రరాష్ట్ర ఎయిడ్ ఎలిమెంటరీ స్కూలు టీచర్ల
# టీచరు - మేనేజర్ల, మహాసభలు- గుంటూరు.

ప్రారంభకులు— గౌ॥ మద్రాసు విద్యాశాఖా మంత్రి డా॥ **M. V.** కృష్ణారావుగారు.
జరుగు తేదీ—ఈ అక్టోబరు నెలలో—తేదీ దినపత్రికలలో తరువాత తెలుపబడును.

సోదరీ, సోదరోపాధ్యాయులారా !

ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు టీచర్ల, టీచరు-మేనేజర్ల స్థితి చాలా వెనుకబడియున్నది. మనము ఎంత శ్రమపడిపని చేసినను ఇతరయాజమాన్యము లందలి టీచర్ల జీతాలతో సమానమగు జీతాలనైనా మన ప్రజాప్రభుత్వం నుండి మనము యింతవరకు పొందలేకపోయాము. మేనేజర్లకీయబడు మెయింటెనెన్సు గ్రాంటు పరీక్షాధికారుల దయా దాక్షిణ్యములకు వదలివేయబడినది. ఇండ్లఅద్దెలు, తదితరములకు అగుఖర్చులు, దినదినానికి మితిమీరిపెరిగి పోవుచుండగా వాటిని విచారించు నాథులు అగుపడుటలేదు. ఈవిధంగా టీచర్లు, మేనేజర్లు, దుర్భరస్థితికి లోనై యున్నారు-

ఇతర టీచర్లకంటె మన సంఘాలద్వారా మనమంతో ఎక్కువగా ఆందోళనచేస్తేనే కాని ప్రభుత్వపు దృష్టి మనవైపుకు మరలదు. కాన టీచరు - మేనేజర్లు, టీచర్లు, ఈ మహాసభలకు వేలకువేలుగా వచ్చి, విరివిగా చందాలు విరాళాలు, తామియిచ్చియు, ప్రజలనుండి వసూలుచేసియు, మాకు సర్వవిధాల తోడ్పడకోరుచున్నాము.

డెలిగేటు రుసుము :—2-0-0.

ముందుగా డెలిగేటురుసుము పంపువారికి ప్రత్యేక వసతులుండును. డెలిగేట్లకు తీర్మానములపై చర్చించు హక్కుండును.

వివరములకు :—
కొత్తపల్లి సీతారామయ్య
R. అగ్రహారం.
గుంటూరు.

ఇట్లు
కొత్తపల్లి సీతారామయ్య.
కె. వి. శ్రీనివాసరావు.
కన్వీనర్లు.

**N. B :—** గౌ॥ విద్యాశాఖామంత్రి గారు సెప్టెంబరులో సభలకు రాజాలననియు, అక్టోబరులో సభలు జరుపుకొనవచ్చుననియు, టెలిగ్రాం ఇచ్చినారు.

---

# వివేక ప్రశ్నలు

అక్షరములు మూడు-అగునొక్క వృక్షంబు;
ఆదివర్ణముడుప - నగును రాజు;
మొదలు చివర గలిపి-చదివిన రోజగు;
అట్టిచెట్టుపేరు-నరసి చెప్పుడు.

దోశల తమ్మిశెట్టి, టీచరు - కింతలవానిపేట.

అక్షరములు నాల్గు - ఒక్క శబ్దమునకు
పలుగ కాల దాసిభావ మొప్పు,
జీవతరువు-గుంపు-భావింప బిడ్డలు
అట్టి శబ్దమేదో యరసి చెప్పుడు.

రావెల వెంకటసుబ్బారావు,
టీచరుమేనేజరు- రావెల.

# సెప్టెంబరు నెల చిత్రప్రశ్నలు

(1952 సం॥ సెప్టెంబరు సంచికలో ప్రకటింపబడిన)

## వివేక ప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు సమాధానములు

౧, పరివేల్లము. ౨. చిత్రపక్షము. ౧. కలవరాయి

అన్నిటికి సరియైన సమాధానములు పంపినవారు

చందా నెం.

గుండేపూడి హనుమంతరావుగారు - శనివారపుపేట.
695 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మొయిద.
571 భానూరు సత్యనారాయణ పట్నాయక్‌గారు - హెడ్మాష్టరు - అవలంగి.
270 భోగాపురపు సీతారామ స్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిక.
46 రేగిడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం

మూడవ ప్రశ్నకు మాత్రమే

180 దుంపనారాయణ మూర్తిగారు - అడపాపేట.
521 అల్లరాజు బంగారంగారు - టీచరు విద్యార్థి - అమలాపురం.
458 అల్లంరాజు సూర్యారావుగారు - హెడ్మాష్టరు - శృంగవరము.
156 దుంప రామమూర్తిగారు - టీచరు - చింతపల్లిపేట.
872 దోశల తమ్మిశెట్టిగారు - టీచరు - కింతలవానిపేట.

---

## పదపూరణము

సమాధానములు

యం. తాతయ్యగారు కూర్చినవి.

1. కచ్చిక 2. కటీక
3. కటుక 4. కడక
5. కన్యక 6. కరక
7. కట్టుక 8. కలీక
9. కర్ణిక 10. కనిక

కాశిన ఆదినారాయణ కూర్చినవి.

1. అధ్వరము 2. అసితము
3. అనుమడు 4. అగదము
5. అన్వేషము 6. అపూపము
7. అభీష్టము 8. అగదము
9. అరిత్రము 10. అలికము

సరియైన సమాధానములు పంపినవారు

180 శ్రీదుంప నారాయణమూర్తి - అడపాపేట
కొలుకులూరి వెంకటేశ్వర్లు - 5 వ తర-పుల్లలచెరువు (క్రిందటినెల)
సుకవు శ్రీనివాసులు-4 వ తర-న్యామద్దల




**అమలాపురము:—**

గవర్నమెంటు ట్రయినింగుస్కూలు ఉపాధ్యాయుల ఆధ్వర్యమున ది 2-10-52 తేదిని గాంధీజీ జన్మదినోత్సవము అతివైభవముగా జరిగినది. ఉదయం గం॥ 4-30 లకు ప్రభాతభేరీ; 6 గం॥లకు పారిశుధ్యం 7 గం॥లకు పతాకవందనము, భగవద్గీత, ఖొరాన్, బైబిల్, పఠనము, 8 గం॥లకు పూజ, 9 గం॥లకు భజన, 9-30 గం॥లకు హిందీ, సంస్కృతము చదువుట. 10 గం॥లకు సూత్రయజ్ఞం మధ్యాహ్నం 3 గం॥ బాలురచే డ్రిల్లు సంబంధమైన ఆటలు, 4 గం॥లకు విచిత్రవేషములు, 4-30 గం॥లకు శ్రీ తనికెళ్ళ బుచ్చి వెంకట్రావుగారి (H. M) అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. బాలురు "జనగణమన" అను జాతీయ గీతములు పాడిరి. పలువు రుపన్యసించిరి. బాలురకు అల్పాహారవిందు జరుపబడెను.

అల్లంరాజు బంగారం,
ఎలిమెంటరీ జూనియర్ - అమలాపురము

**తాడికొండ:—**

తాడికొండ 13 సెప్టెంబరు ఈరోజు తాడికొండ ఉపాధ్యాయ కేంద్రసంఘమువారు, బోర్డు పాఠశాలయందు, శ్రీయుత్. రామారావుగారి ఆధిపత్యమున సభజరపిరి. సభకు షుమారు నలభైమంది ఉపాధ్యాయులు వచ్చిరి. సభలో ఈ క్రింది తీర్మానమును ఏకగ్రీవముగా ఆమోదించిరి. "కృష్ణానది ఆనకట్ట మరమ్మతు పనిని తనిఖీ చేయడానికై వెళ్లిన, ప్రముఖ ఇంజనీర్లున్నూ, వారిసహాయకులు, పనివారలు, నదిలో మునిగి అసువులు గోల్పోయినందున, వారిఆత్మకు శాంతి కలుగుటకై భగవంతుని ప్రార్థించిరి." తమ సంతాప సందేశమును వారి బంధుకోటికి తెలియజేసిరి.

బి. నరసింహారావు,

## రాయలసీమ ఉపాధ్యాయులకు అమెరికా ఉపాధ్యాయుల తోడ్పాటు

ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్సు ఫెడరేషన్ తరఫున 52 మే లో క్షామమును వాతబడిన రాయలసీమ ఉపాధ్యాయులకు, విద్యార్థులకు; విరాళాలుపంపి తోడ్పడవలసినదిగా ప్రపంచ ఉపాధ్యాయులను కోరిన ఫలితంగా అమెరికా టీచర్సు యూనియనునుండి 25 డాలర్లు (షుమారు 120 రూ॥లు) పంపుతూ యూనియన్ ప్రెసిడెంటుగారు యీ క్రిందివిధముగా లెటరు వ్రాశారు.

"మీ లెటరు చేరునప్పటికి మా స్కూల్సుకు ఎండాకాలపు సెలవు లిచ్చినందున, మా కార్యకర్తలందరనూ సమావేశపరచి, సహకరించేందుకు అవకాశంలేకుండా పోయింది. కాన యూనియనునుండి ముందుగా యీ విరాళం పంపుతున్నాం. సెలవులనుండి స్కూల్సు తెరవబడగానే యింకను డబ్బు, గుడ్డలు, మందులు పంపగలమని విశ్వసించుతున్నాం.

గాంధీనగరం,
విజయవాడ.
9—8—1952

ఇట్లు,
చెన్నుపాటి లక్ష్మయ్య
ప్రెసిడెంటు ఆం॥ రా॥ ఎ॥ టీ॥ ఫెడరేషన్.

అమలాపురం:—

అమలాపురం తాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు టీచర్ల యూనియన్ వర్కింగ్ కమిటీ మీటింగు ది 14-9-52 తేదీ ఆదివారం పగలు 2 గంటలకు అమలాపురం శ్రీనివాస ఎయిడెడ్ స్కూలునందు మ॥ రా॥ శ్రీ కె. సోమేశ్వరరావు యూనియన్ ప్రెసిడెంటువారి ఆధిపత్యమున జరుపబడి యీ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడినవి.

I. ఇదివరలో లోయరుగ్రేడు ట్రైనుడు టీచర్సు హయ్యరుగ్రేడు T.S.L.C పరీక్షకు హాజరయి, కొన్ని సబ్జెక్ట్సు ప్యాసయియున్న వారికి తిరిగి పరీక్షలకు హాజరయి మిగతా సబ్జెక్ట్సు పూర్తిచేసుకొనేటందులకు అవకాశ మిప్పించమని అధికారులను కోరుచూ ఏకగ్రీవముగా తీర్మానించిరి.

II. ది 31-12-50 తేదీ అర్ధరాత్రికే ఇంక్రిమెంట్లు పొందుటకు అర్హత కలిగియున్నట్టి సెకండరీ గ్రేడు ఉపాధ్యాయులకు ది 1-1-1951 నుండి సదరు ఇంక్రిమెంట్లు మంజూరుచేయకుండా యుండినందున సదరు ఇంక్రిమెంట్లను వెంటనే మంజూరు చేయించగలందులకు కోరుచు తీర్మానించిరి.

III. ఉపాధ్యాయులకు యిచ్చుచున్న జీతములు అలవెన్సులు ప్రస్తుత పరిస్థితులలో వారికగు ఖర్చులకు (భిక్ష్యం ఖర్చులకు అయినను) చాలకున్నందున సదరు ఉపాధ్యాయుల జీతములు అలవెన్సులు సెంట్రల్ పేకమీషన్ వారి శిఫార్సుల ననుసరించి హెచ్చించ వలసినదిగా అధికారులను కోరుచు తీర్మానించిరి.

IV. ఎలిమెంటరీస్కూళ్ళలో V వ తరగతి ప్యాసుఅయిన విద్యార్థులయొక్క రికార్డుషీటుకు హైస్కూళ్ళలో వాడుచేయునప్పుడు విలువ యిప్పించ గలందులకు అధికారులను కోరుచు తీర్మానించిరి.

V. ఈరోజువరకు అయిన యూనియను జమాఖర్చులను సరిచూచి ఆమోదించుచు తీర్మానించిరి.

అమలాపురం,
ది 14—9—1952.

సి. నాగభూషణం,
సెక్రటరీ, తాలూకా ఎయిడెడు టీచర్సు యూనియన్, అమలాపురం.

## సెంట్రల్ పేకమీషను స్కేల్సు అమలు జరుపాలి

తూర్పుగోదావరి జిల్లా ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషను కార్యదర్శి- యం. నరసింహస్వామి గారిలా వ్రాస్తున్నారు.

ది 21-9-52 ఆదివారం కొత్తపేట తాలూకా ప్రాథమికోపాధ్యాయ కన్వెన్షను కొత్తపేట హిందూ ఎయిడెడు ఎలిమెంటరీ పాఠశాలలో జిల్లా అధ్యక్షులు శ్రీ గొడవర్తి శ్రీరాములుగారి అధ్యక్షతను జరిగింది. తాలూకాలోని వివిధ కేంద్రములనుండి 40 మంది సభ్యులు హాజరైరి-ప్రారంభోపన్యాసంలో అధ్యక్షులు మాటలాడుచు, ఉపాధ్యాయులు ప్రస్తుతము హీనస్థితిని అనుభవించుచున్నారనియు, ప్రస్తుతపు ఇక్కట్లను తీర్చుకొనుటకు నిమిత్తము అందరు కలసి పనిచేయవలసియున్నదనియు, ప్రబోధించిరి. జిల్లా కార్యదర్శి యం. నరసింహస్వామిగారు గత ఉద్యమాన్ని సమీక్షిస్తూ మన ఫెడరేషను ద్వారా 416 జి. ఓ, అ వంటి సంకెళ్ళను ఛేదించి, ప్రపంచ ఉపాధ్యాయుల మన్ననలను పొంది, గొప్పచరిత్రను నిర్మించామనియు, రాష్ట్రీ ఫెడరేషను కార్యదర్శిగారైన శ్రీ సింగరాజు రామకృష్ణయ్య M. L. C గారిని ఎన్నికలలో మనము గెలిపించుకొనుట ఘనకార్యమనియు, ఉపాధ్యాయులు తమ ప్రతి సమస్యను ఫెడరేషనుద్వారా పరిష్కరించుకొనుటకు కృషిచేసి యూనియనును పటిష్ఠము చేయాలనియు, నూతన ప్రభుత్వము మనకష్టాలను గుర్తించలేదు. పరిగదా, మనజీతాలు హెచ్చించితే కాఫీహోటళ్ళకు సినిమాలకు టీచర్లు వెళ్ళుతారని హేళన స్థితికి తెచ్చి, ప్రభుత్వము మనలను నిరసించినదనియు, ఆస్థితినుండి మనలను గుర్తించేలాగున చేయాలంటే బలవత్తరమైన సంఘాన్ని నిర్మించుకొనుటయే మార్గమని నుడివిరి.

అనంతరము ప్రస్తుతము ఉపాధ్యాయుల స్థితి అతికష్టముగా కొలుకొనుటకుగాను కనీసము సెంట్రల్ పే కమీషను స్కేల్సు అమలుజరుపాలనియు, ఎయిడెడు టీచర్లకు మరుచటినెల 15 వ తేదీ లోగా జీతములు పంపవలెననియు, మనిఆర్డరుఫీజు ప్రభుత్వమే భరించాలనియు, జిల్లాబోర్డు టీచర్ల ఇక్కట్లు తీర్చాలనియు, తీర్మానించడమైనది.

నూతనసంవత్సరమునకు శ్రీ అద్దంకి కేశవరావుగారిని అధ్యక్షులుగను, శ్రీ సేమాని విశ్వనాథం గారిని కార్యదర్శిగను, మరి ఏడుగురిని కార్యవర్గసభ్యులుగాను ఎన్నుకొనడమైనది.

కొత్తపేట,
21-9-52,

ఇట్లు,
యం. నరసింహస్వామి, కార్యదర్శి.

రాజోలు :—

రాజోలుతాలూకా ప్రాథమికోపాధ్యాయ యూనియన్ మహాజనసభ రాజోలు బోర్డు బాలికా పాఠశాలా భవనమందు శ్రీ సింగరాజు రామకృష్ణయ్య (యమ్. యల్. సి) గారి అధ్యక్షతను ది 5-9-52; 6-9-52 తేదీలలో జరుపబడెను.

5 వ తేదీ రాత్రి 8 గం॥లకు ప్రతినిధుల సమావేశము జరుపబడెను. తాలూకాలో 400 మంది ఉపాధ్యాయులు సంఘసభ్యులుగా ఉండుట మిక్కిలి ప్రశంసనీయమని అధ్యక్షులు పలికిరి. తిరిగి 6 వ తేదీ ఉదయం 8 గంటలకు ప్రతినిధుల సభ ప్రారంభింపబడెను. అందు ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

(1) ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్సు ఫెడరేషను సంఘమును రిజిష్టరు చేయవలెననియు —
(2) సెంట్రల్ పేకమీషను స్కేళ్ళు అమలు జరుపవలెననియు —
(3) వివిధ మేనేజిమెంట్లను రద్దుచేసి, విద్యాశాఖను ప్రభుత్వమువారే నిర్వహించవలెననియు —
(4) ఎయిడెడ్ మేనేజర్లను భరించమనిన 3-0-0 లు ప్రభుత్వమువారే భరించవలయుననియు—
(5) స్థానికసంస్థలలోకూడా ఉపాధ్యాయులకు కొన్ని స్థానములు నిర్ణయించబడవలెననియు, అందు ప్రతినిధులను ఎన్నుకొనుటకు ప్రాథమికోపాధ్యాయులకు అవకాశ ముండవలెననియు—
(6) రాయలసీమ ఉపాధ్యాయులకు హాజరు, రోలు మొదలగు షరతులనుబట్టి జీతము నిర్ణయించుటమాని, ఉపాధ్యాయులుగా పనిచేయుచున్న వారలకు పూర్తిజీతము నిచ్చుచు కరువుకాలములో వారలకు కరువుభత్యము పెంచవలసినదనియు—
(7) ప్రభుత్వమువారిచే రద్దు చేయబడిన ఉపాధ్యాయుల సర్టిఫికెట్లు రద్దుచేసిన కాలములో వారి జీతములు యీయవలసినదిగాను ప్రభుత్వము వారిని ఈ సంఘమువారు కోరిరి.

మధ్యాహ్నము 1 గంటకు మహాజనసభ, దైవప్రార్థనతో ప్రారంభింపబడెను. తాలూకాలోని వివిధప్రాంతముల నుండి 500 మంది ఉపాధ్యాయులు మహాజనసభకు హాజరైరి. శ్రీ కందుకూరి రామభద్రరావుగారు బి. ఎ. బి. యిడి సభను ప్రారంభించుచు, ఉత్తర మద్రాసు ఉపాధ్యాయ నియోజకవర్గమునకు ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీస్కూలు టీచర్సు ఫెడరేషన్ కార్యదర్శి శ్రీ సింగరాజు రామకృష్ణయ్యగారు ఎన్నుకొనబడుటకు ప్రాథమికోపాధ్యాయ సంఘము గర్వించవలెననియు, ప్రాథమిక, ఉన్నతపాఠశాలా ఉపాధ్యాయులందరు ఒకటేనని రుజువుపరచుటకు యిదియొక నిదర్శనమనియు, పలికిరి. ఉపాధ్యాయులకు వాక్ సభా పత్రికా సంఘ స్వాతంత్ర్యము కలిగించుటకు అధ్యక్షులు చేసిన కృషిని అభినందించిరి. తరువాత అధ్యక్షులు ఉపాధ్యాయులు ప్రస్తుతము ఆర్థిక సాంఘికములలో వెనుకబడి యున్నారనియు ఉపాధ్యాయులందరు సంఘములోచేరి తమ న్యాయమైనహక్కులకోసం పాటుపడవలెననియు ఉపన్యసించిరి.

మహాజనసభ జరుపుటకు వసూలుచేసిన విరాళము మొత్తములో నుండి రాష్ట్రసంఘమునకు రు 40/– లు విరాళముగా ఆహ్వానసంఘ అధ్యక్షులు శ్రీ సత్తిరాజు గోపాలకృష్ణమూర్తిగారు ఒసంగిరి.

తాలూకా యూనియన్‌కు శ్రీ సి. దక్షిణామూర్తిగారు అధ్యక్షులుగను, శ్రీ ఆర్. విశ్వనాథరాజు గారు కార్యదర్శిగను, ఎన్నుకొనబడిరి.

ఆహ్వాన సంఘ అధ్యక్షుల అభినందనములతో మహాజనసభ ముగింపబడెను.

# రామా అండ్ కో., (H.O.) ఏలూరు

బ్రాంచెస్ :—గుంటూరు - రాజమండ్రి - తెనాలి - భీమవరం - విజయనగరం.



ప్రస్తుత ప్రాథమిక విద్యాప్రణాళిక ననుసరించి తయారుచేయబడిన
పుస్తకములు, ఇతర పుస్తకముల జాబితా.

ఇంగ్లీషు పాఠ్యగ్రంథములు

## LADDER OF ENGLISH

BY
The Rev. S. Paul B. A., B. T.,
and
Edited by Miss Olga Williamson
M. A.

**1951**

| | | |
|---|---|---|
| Book I for VI Std. (1950) | Rs. 1 0 0 | |
| Book II for VII Std. (1950) | 1 2 0 | |

## జాతీయవాచకములు

ఉభయ భాషాప్రవీణ
వారణాసి రామబ్రహ్మం, యం. ఏ. గారిచే
డాక్టరు వేపా వరాహానరసింహం,
యం. ఏ. పి. హెచ్. డి. గారి
సూచనల ననుసరించి

| | | | |
|---|---|---|---|
| 1 వ తరగతి | 0 4 0 | 5 వ తరగతి | 0 9 0 |
| 2 వ తరగతి | 0 5 0 | 6 వ తరగతి | 0 11 0 |
| 3 వ తరగతి | 0 6 0 | 7 వ తరగతి | 0 12 0 |
| 4 వ తరగతి | 0 8 0 | 8 వ తరగతి | 0 12 0 |

## జయరామావాచకములు

కవిరాజహంస, కవికులాలంకార
ఓలేటి పార్వతీశము గారు

ఉపాధ్యాయుల సత్యనారాయణగారు M.A.L.T.
Retired District Educational officer

| | |
|---|---|
| మొదటి తరగతి | 0 4 0 |
| రెండవ తరగతి | 0 5 0 |
| మూడవ తరగతి | 0 6 0 |
| నాలుగవ తరగతి | 0 8 0 |
| ఐదవ తరగతి | 0 9 0 |
| ఆరవ తరగతి | 0 11 0 |
| ఏడవ తరగతి | 0 12 0 |

## గుణితబోధిని

[పిల్లలకు గుణింతము, ద్విత్వమును నేర్పుటకు ఉచ్చారణలో తప్పులులేకుండ చదివించుటకు, గ్రేడువారిగా ప్రచురించబడినవి. వాచక పుస్తకములకు చక్కని అనుబంధములు. [Supplements of Telugu Readers.]

| | | | |
|---|---|---|---|
| 1 వ భాగము | 0 3 6 | 3 వ భాగము | 0 4 6 |
| 2 వ భాగము | 0 4 0 | 4 వ భాగము | 0 5 0 |

## భారతదేశీయ చరిత్రలు

డాక్టర్
జి. వి. సీతాపతిరావు, బి.ఏ.,ఎల్.టి. గారిచే

| | | | |
|---|---|---|---|
| 3 వ తరగతి | 0 5 6 | 6 వ తరగతి | 0 11 0 |
| 4 వ తరగతి | 0 6 6 | 7 వ తరగతి | 0 15 0 |
| 5 వ తరగతి | 0 8 0 | 8 వ తరగతి | 0 14 0 |

## భారతదేశము

(చరిత్ర)

సి. హెచ్. సత్యనారాయణరావు,
బి. ఏ. [లిట్] బి. యిడి.
బి. శేషాచార్యులు, బి. ఏ., ఎల్. టి. గార్లచే

| | |
|---|---|
| 4 వ తరగతి | 0 6 0 |
| 5 వ తరగతి | 0 8 0 |
| 6 వ తరగతి | 0 12 0 |
| 7 వ తరగతి | 0 14 0 |
| 8 వ తరగతి | 0 12 0 |

## హిందూదేశ చరిత్ర

సి. భీమసేనరావు, బి. ఏ., ఎల్. టి.

| | |
|---|---|
| 6 వ తరగతి | 0 11 0 |
| 7 వ తరగతి | 0 13 0 |
| 8 వ తరగతి | 0 12 0 |

## సివిక్సు పాఠములు

మునిమాణిక్యం నరసింహారావు, బి. ఏ., ఎల్. టి.,

3 వ తరగతి 0 4 0

4 వ తరగతి 0 7 0

మునిమాణిక్యం నరసింహారావు, బి. ఏ., ఎల్. టి.,
పి. వెంకటరత్నం. బి.యస్‌సి డి యఫ్.బి.యుడి.

[రివైజ్డు]

కొండేపూడి సుబ్బారావు, బి. ఏ., బి. యుడి.,

5 వ తరగతి 0 9 0

6 వ తరగతి 0 10 0

7 వ తరగతి 0 12 0

మునిమాణిక్యం నరసింహారావు, బి. ఏ., యల్. టి.,
పి. వెంకటరత్నం, బి యస్‌సి. డి.యఫ్. బి. యుడి.

8 వ తరగతి 0 14 0

## గణితదర్పణములు

కె. వెంకటేశ్వర్లు, B. A., B. Ed.,
Deputy Inspector of Schools.

1, 2 తరగతులకు 0 8 0

3 వ తరగతి 0 10 0

4 వ తరగతి 0 14 0

5 వ తరగతి 1 0 0

తెనుగు లెక్కలు [డి. సుబ్బారాయుడుగారిచే]
0 5 0

నోటిలెక్కలు [యం. సుబ్బారాయుడుగారిచే]
0 5 0

## నేచర్‌స్టడీ వాచకములు

నిడమర్తి సత్యనారాయణమూర్తి, బి. ఏ., బి. యుడి.,
టి. నరసింగరావు, బి. ఏ., ఎల్. టి., గార్లచే

మూడవ తరగతి 0 4 0

నాలుగవ తరగతి 0 6 0

ఐదవ తరగతి 0 7 0

## ప్రాథమిక విజ్ఞానశాస్త్రములు

నిడమర్తి సత్యనారాయణమూర్తి, బి ఏ.బి.ఇడి. గారిచే

ఆరవ తరగతి 0 10 0

ఏడవ తరగతి 0 12 0

ఎనిమిదవ తరగతి 0 14 0

## ప్రాథమిక విజ్ఞానశాస్త్రము

(నూతన సిలబస్ ప్రకారం వ్రాయబడినవి.)

జి. నరసింహారావు, బి ఏ., గారిచే

**1951**

ఆరవ తరగతి 0 14 0

ఏడవ తరగతి 1 0 0

ఎనిమిదవ తరగతి 1 0 0

## ప్రాథమిక భూగోళములు

[1941 సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి]
కె. వేంకట్రావు. బి. ఏ., బి. యుడి, గారిచే

2 వ తరగతి 0 4 0 — 3 వ తరగతి 0 5 0

4 వ తరగతి 0 9 0 — 5 వ తరగతి 0 11 0

## ఆదర్శ భూగోళశాస్త్రము

ఆర్. ఎస్. రాఘవులు, బి. ఏ., ఎల్. టి., గారిచే

[రివైజ్డు]

6 వ తరగతి 1 0 0

7 వ తరగతి 1 0 0

8 వ తరగతి 1 0 0

## బాలగానమాల

సంగీతము-[స్వరములతో] కె. రామకృష్ణశాస్త్రిగారిచే

1 వ తరగతి 0 3 6 — 2 వ తరగతి 0 4 0

3 వ తరగతి 0 4 0 — 4 వ తరగతి 0 4 6

5 వ తరగతి 0 4 6 — 6 వ తరగతి 0 5 6

7 వ తరగతి 0 5 6 — 8 వ తరగతి 0 6 6

4 వ తరగతి [స్వరం లేకుండా] 0 3 6

## నిఘంటువులు

అమరకోశము ప్రథమకాండ

మూలం 0 8 0

సటీక 0 10 0

అమరం త్రికాండ సటీకా క్యాలికో 4 8 0

ఆంధ్రనామ సంగ్రహము సటీక 0 10 0

ఆంధ్ర నిఘంటుత్రయము

డిటో అట్టబైండు 2 0 0

డిటో క్యాలికో 2 8 0

శబ్దమంజరి 0 8 0

# ఉ ప వా చ క ము లు

| | |
|---|---|
| కృష్ణవేణి | 0 9 0 |
| బృహన్నల విజయము | 0 15 0 |
| ముక్తాంబ | 0 12 0 |
| అజ్ఞాతవాసము | 0 7 0 |
| పురాణ చంద్రిక 1 వ భాగము | 0 8 0 |
| డిటో 2 వ భాగము | 0 10 0 |
| దశావతారములు | 0 10 0 |
| షట్చక్రవర్తులు | 0 9 0 |
| చారిత్ర నాటక పంచకము | 0 9 0 |
| పోటీ పరీక్షా వ్యాసములు | 1 1 0 |
| యదువంశము | 0 9 0 |
| రఘుకుల వీరులు | 0 9 0 |
| హరివంశము | 0 13 0 |
| అనసూయ | 0 5 0 |
| నోముల కథలు | 0 5 0 |
| జాతీయ కథావళి | 0 5 0 |
| నీతి కథామంజరి | 0 8 0 |
| పర్వదిన మహాత్మ్యము | 0 5 0 |
| భీష్మ మహిమ | 0 6 0 |
| కథా రామాయణము | 0 7 0 |
| అభిమన్యుడు | 0 7 0 |
| మోహన (నవల) | 0 7 0 |
| రణతిక్కన చరిత్ర | 0 7 0 |
| పరశురాముని చరిత్ర | 0 9 0 |
| ఉత్తరరామాయణసారము | 0 9 0 |
| రాజసూయము | 0 9 0 |
| ప్రతాపరుద్రుడు | 0 9 0 |
| కురువంశము | 0 9 0 |
| ఆంధ్రరాజులు | 0 4 6 |
| ఆంధ్రులు | 0 4 6 |
| ఉపాఖ్యాన రత్నావళి | 0 4 6 |
| భోజ చరిత్ర | 0 5 6 |
| రుద్రమదేవి | 0 7 6 |
| భారత నారీమణులు | 0 7 6 |
| ప్రహ్లాద చరిత్ర | 0 5 0 |
| రామాయణసారము | 0 9 0 |
| భారతసారము | 0 12 0 |
| భాగవత కథాసారము | 0 13 0 |
| కర్ణుని చరిత్ర | 0 9 0 |
| భీష్మ చరిత్ర | 0 9 0 |
| నీతిచంద్రిక | 0 8 0 |
| శ్రీరామచంద్రమూర్తి | 0 6 6 |
| తిన్నడు - గుణనిధి | 0 11 0 |

# శ త క ము లు

| | |
|---|---|
| సుమతి శతకం మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 4 0 |
| దాశరథి శతకము మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 6 0 |
| వేమన శతకము మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 5 0 |
| నృసింహ శతకము మూలం | 0 3 0 |
| ,, సటీక | 0 10 0 |
| సుదతీ సునీతి శతకము మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 5 0 |
| గజేంద్ర మోక్షము మూలం | 0 4 0 |
| ,, సటీక | 0 10 0 |
| కుచేలోపాఖ్యానము (పోతన) | 0 6 0 |
| కుచేలోపాఖ్యానము (గట్టుప్రభువు) | 0 8 0 |
| భోగినీ దండకము (పోతన) | 0 8 0 |
| ప్రహ్లాద చరిత్ర సప్తమస్కంధము మూలం | 0 8 0 |
| కృష్ణశతకము మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 5 0 |
| భాస్కర శతకము మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 10 0 |
| హనుమాన్ శతకము మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 5 0 |
| బాలరామాయణము మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 4 0 |
| కుమార శతకము మూలం | 0 2 0 |
| ,, సటీక | 0 5 0 |
| భర్తృహరి సుభాషిత నీతిశతకము సటీక | 0 6 0 |
| రుక్మిణీ కళ్యాణము | 0 4 0 |
| ,, సటీక | 0 10 0 |
| నలోపాఖ్యానము సటీక | 0 10 0 |

గ్రంథాలయములకు



# శ్రీమదాంధ్ర మహాభాగవతము

[పద్య కావ్యము - పోతన ప్రణీతము]

చక్కని క్యాలికో బైండు

| | | | |
|---|---|---|---|
| సంపూర్ణ ప్రతి - ఒకే సంపుటము | 12 | 0 | 0 |
| సంపూర్ణ ప్రతి - రెండు సంపుటములుగా | 14 | 0 | 0 |
| డిటో విడివిడిగా ఒక్కొక్క ప్రతి. | 7 | 8 | 0 |
| సంపూర్ణ ప్రతి-మూడు సంపుటములుగా | 16 | 0 | 0 |
| డిటో విడివిడిగా ఒక్కొక్క ప్రతి | 6 | 0 | 0 |

# శ్రీమదాంధ్ర మహాభారతము

[పద్య కావ్యము - కవిత్రయ ప్రణీతము]

చక్కని క్యాలికో బైండు

| | | | |
|---|---|---|---|
| 1 ఆది, సభాపర్వములుగల సంపుటము | 4 | 0 | 0 |
| 2 అరణ్యపర్వము | 4 | 0 | 0 |
| 3 విరాటోద్యోగపర్వములు | 4 | 0 | 0 |
| 4 భీష్మ, ద్రోణపర్వములు | 4 | 0 | 0 |
| 5 కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు | 4 | 0 | 0 |
| 7 శాంతిపర్వము | 4 | 0 | 0 |
| 8 ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | 4 | 0 | 0 |
| శ్రీమదాంధ్ర మహాభారతము సంపుటముల సెట్టు | 28 | 0 | 0 |
| డిటో 3 సంపుటములలో | 26 | 0 | 0 |
| 1 ఆదిపంచకము - ఒకే సంపుటము | 10 | 0 | 0 |
| 2 యుద్ధపంచకము - డిటో | 8 | 0 | 0 |
| 3 శాంతిసప్తకము - డిటో | 8 | 0 | 0 |

## శ్రీమదాంధ్ర మహాభారతము

[వచనము] 3 0 0

మహావాది వెంకటరత్నం ప్రణీతము B. A.

[ఆదిపర్వము, సభాపర్వము
రెండు సంపుటములు క్యాలికో]

## భారతం శాంతిపర్వము

[పద్యం, మున్నంగిశర్మ పరిష్కృతము, సులభముగ అర్థమగుటకు పద విరామములు తెలుపు గుర్తులతో]
3 0 0

## శ్రీమద్భగవద్గీత (రామానుజ భాష్యము)

| | | | |
|---|---|---|---|
| ప్రతిపద టీకా భాష్య విశేషార్థ సహితము క్యాలికో బైండు | 10 | 0 | 0 |
| డిటో ఆంధ్ర తాత్పర్యసహితము క్యాలికో బైండు | 2 | 0 | 0 |
| డిటో రేపరు బైండు | 1 | 8 | 0 |
| డిటో మూలం | 0 | 8 | 0 |
| డిటో ఆంధ్రవచనము చిన్నసైజు | 0 | 8 | 0 |
| భాస్కర రామాయణము క్యాలికో బైండు (పద్యకావ్యము) | 8 | 0 | 0 |
| భర్తృహరి సుభాషితము | 4 | 0 | 0 |
| భర్తృహరి సుభాషితము (నీతిశతకము మాత్రము టీక) | 0 | 6 | 0 |
| శ్రీకృష్ణ కర్ణామృతము | 3 | 0 | 0 |
| శ్రీరామకర్ణామృతము | 2 | 8 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము ద్విపద (గౌరన) | 1 | 0 | 0 |
| నలచరిత్ర డిటో | 0 | 10 | 0 |
| మోక్షగుండ రామాయణము | 3 | 8 | 0 |
| [హరికథ] యక్షగానము క్యాలికో మొల్ల రామాయణము | 1 | 0 | 0 |

## అష్టాదశ పురాణసారము (వచనం)

| | | | |
|---|---|---|---|
| 4 భాగములు విడిప్రతి ఒక్కొక్కటి | 1 | 4 | 0 |
| 4 భాగములు క్యాలికో ఒకేసంపుటములో | 5 | 8 | 0 |

| | |
|---|---|
| భగవన్నుతి - (3 భాగములు) | 0-10-0 |
| విజ్ఞానలహరి | 0 6 0 |
| ప్రార్థనదీపిక | 0 2 0 |
| కుశలవ నాటకము | 0-12-0 |

## స్తోత్రములు, సహస్రనామములు

| | | |
|---|---|---|
| శ్రీసహస్రనామ స్తబకము | [క్యాలికో] | 1 0 0 |
| ,, | [రేపరు] | 0 12 0 |
| ముకుందమాల | [సటీక తాత్పర్యము] | 0 8 0 |
| ఆదిత్యహృదయము | ,, | 0 6 0 |
| సవితృసర్వస్వము | ,, | 0 4 0 |
| నీతిశాస్త్రము | ,, | 0 4 0 |
| భజగోవిందశ్లోకములు | ,, | 0 3 0 |
| శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రము | | 0 3 0 |

| | |
|---|---|
| మహిమ్న స్తోత్రము | 0 4 0 |
| ఆంజనేయ సహస్రనామము | 0 5 0 |
| లలితా సహస్రనామము (అట్టబైండు) | 0 10 0 |
| (క్యాలికో) | 0 12 0 |
| శివసహస్రనామము | 0 5 0 |
| గణపతి సహస్రనామము | 0 5 0 |
| రామసహస్రనామము | 0 5 0 |
| గోపాలసహస్రనామము | 0 5 0 |
| లక్ష్మీసహస్రనామము | 0 5 0 |
| విష్ణుసహస్రనామము | 0 8 0 |
| పితృతర్పణము | 0 2 0 |
| బ్రహ్మయజ్ఞము | 0 2 0 |
| సంధ్యావందనము | 0 6 0 |
| మంత్రపుష్పము | 0 2 0 |
| యూనానీ వైద్యామృతసాగర్ (వైద్యగ్రంథము) | 4 0 0 |
| గీతా హృదయము [డా॥ శంకర శ్రీరామారావుగారిచే] | 0 12 0 |
| సంగీతాలు | 0 12 0 |

# ఆంధ్ర దశరూపకము

(A Book on Telugu Dramaturgy)

రచయిత :

బ్ర॥ శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు

(Retired Lecturer, Andhra University)

వెల రు. 0-15-0

## జనమంచి శేషాద్రిశర్మగారి గ్రంథములు

### పద్యకావ్యములు

| | |
|---|---|
| ఆంధ్ర శ్రీమద్రామాయణము, నిర్వచనము 7 సంపుటములు | 18 0 0 |
| 3 సంపుటములు | 15 0 0 |
| బ్రహ్మాండ పురాణము | 6 0 0 |
| తెలుగు బ్రహ్మపురాణము | 5 0 0 |
| తాండవకృష్ణ భాగవతము | 4 0 0 |
| కౌమారికా ఖండము [స్కాందము] | 4 0 0 |
| ధర్మసార రామాయణము | 4 0 0 |
| సర్వమంగళాపరిణయము | 2 0 0 |
| ఆంధ్రులలితోపాఖ్యానము | 2 0 0 |
| హనుమద్విజయము | 0 10 0 |
| కవివిలాసము 1 వ భాగము | 1 0 0 |

### వచనములు

| | |
|---|---|
| శ్రీ కృష్ణావతారతత్త్వము 12 సంపుటములు | 21 0 0 |
| ఒక్కొక్కటి | 1 12 0 |
| శ్రీ రామావతారతత్త్వము 11 సంపుటములు | 19 4 0 |
| ఒక్కొక్కటి | 1 12 0 |
| ఉత్తమమార్గము | 1 0 0 |
| భగవద్గీత, విపులవ్యాఖ్య | 1 8 0 |
| మనుచరిత్ర హృదయావిష్కరణము | 0 12 0 |
| సచ్చరిత్రము | 0 12 0 |
| నీలంరాజుకథ | 0 10 0 |

### వివిధ గ్రంథములు

| | |
|---|---|
| వ్యవహారబోధిని 1 భా॥ | 0 5 0 |
| వ్యవహారబోధిని 2 భా॥ | 0 8 0 |
| తెనాలి రామలింగనికథలు | 0 4 0 |
| రామేశ్వరమజలీకథలు | 0 14 0 |
| చంద్రశేఖరశతకము | 0 3 0 |
| భాషియదండకము | 0 3 0 |
| ఆంజనేయదండకము | 0 1 0 |
| ధర్మసూక్ష్మం [పద్యకావ్యం] | 0 4 0 |
| హస్తసాముద్రికము | 0 5 0 |
| ఆధ్యాత్మరామాయణకీర్తనలు [రేపు] | 1 0 0 |
| ఉద్యానలతిస్వప్నము | 0 3 0 |

### ఇతరులవి

| | |
|---|---|
| రుక్మిణీకల్యాణము [అచ్చుచేయు కొన్నసు] | |
| 3 ఆశ్వాసముల మహాప్రబంధము | 0 12 0 |
| కొండవీడు నాటకం | 0 5 0 |
| విలాసిని [పద్యకావ్యము] | 0 6 0 |
| చంద్రకళావిలాసము | 1 0 0 |
| మిటూరులనీతు [వచనము] | 0 6 0 |
| పాతాళద్వీపము | 0 4 0 |
| యువయువతీ విద్యాసాహచర్యము | 0 4 0 |

వలయువారు :—

## రామా అండ్ కో., H.O. ఏలూరు.

బ్రాంచెస్ :—గుంటూరు, రాజమండ్రి. భీమవరం, తెనాలి, విజయనగరం.

## వీడ్కోలు - తేనీటివిందు

బళ్ళారి ఎయిడెడుస్కూలు టీచర్లు, శ్రీయుత V.S. బావాజీ, B.A.L.T. సీనియర్ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు; వారికి ట్రాన్స్‌ఫర్ ఇచ్చట నుండి కాకినాడకు అయినందున, వీడ్కోలు విందుజరిపిరి. శ్రీయుత డి రాజగోపాలాచార్లు, D. E. O. గారు కూడా విచ్చేసివుండిరి. ఉపాధ్యాయులు తమ యొక్క హృదయ పూర్వక విచారమును వారు తమ్ము విడచి పోవుచుండుటకు వెలిబుచ్చిరి. పై ఇన్‌స్పెక్టరుగారు ఉపాధ్యాయులతో కలసిమెలసి వుండి. అనేక విషయములలో తోడ్పడుతూ వుండిరనియ్యు వారి గొప్ప సుహృద్భావమును, శ్రీ. వి. ఆనంద తీర్థాచార్లు టీచర్సు యూనియన్ పరముగా విన్నవించిరి.

శ్రీయుత D. E. O. గారు పైఇన్స్‌పెక్టరుగారు తమకు చాలా అనుకూలముగా, విద్యా వ్యాప్తి విషయమై చాలాసహాయ పడుచుండిరనీ, అటువంటి మంచివారు తమ్ము విడచి పోవుటకు చాలాచింతించు చుంటిమనీ, అయినా శ్రీ బావాజీగారు, తమ నివాసస్థలమయిన కాకినాడకే పోవటము కొంత సంతోషము కూడా అనియు, వారికి శ్రీ పరమేశ్వరుడు ఆయురారోగ్యములు ఇచ్చునట్లు ప్రార్థించిరి.

శ్రీయుత, బావాజీగారుకూడా, ఉపాధ్యాయులు చెప్పిన వాక్యులకు, శ్రీ D. E. O గారు చెప్పిన మాటలకు, సమాధాన మిచ్చుచూ, మమ్ములను వీడుట వారికికూడ సమాన పరితాపమే అనియు, అభిమానములు వృద్ధిఅయి ఒకరినొకరు అర్థముచేసుకొని, సుఖముగానుండకబోవునప్పాడే శ్రీపరమేశ్వరుడు వేరు జేయునని చెప్పుచూ, వారు ఎచ్చటనున్నను మమ్ములనెవరిని మరువమని చెప్పుచూ, ఈ విందు రూపమునజూపి సగౌరవానికి ఉపాధ్యాయులకు చాలా కృతజ్ఞుడుగా నున్నానని చెప్పుచూ, D, E. O. గారు తమపై చూపుచుండిన ప్రేమకు చాలా కృతజ్ఞుడననియు, వారు తమకు అప్పుడప్పుడు చేసిన మేలును మరువబోరనియు, చెప్పుచూ విరమించిరి.

శ్రీ M, రాచయ్య, సెక్రటరిగారి వందనార్పణములతో విందు ముగిసెను.

---

# ప్రకటన

అధికారేతర గ్రామీణ వయోజనవిద్యా బోధకుల శిక్షణ శిబిరము నాల్గవతూరి కడపజిల్లా వందలూరునందు సెప్టెంబరు 20 వ తేదినుండి 26 వ తేదీవరకు నిర్వహింపబడుతుంది. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ప్రధానాచార్యులుగను, శ్రీ కె. సుబ్బారావు ప్రభృతులు అధ్యాపకులుగను, పనిచేయుదురు. నిరక్షరాస్యతానిర్మూలనకు కృషిచేయ నుత్సహించు అధ్యాపకులు ఈ అవకాశమును సద్వినియోగం చేసుకొన ప్రార్థితులు.

ఇట్లు

కోయిలకుంట్ల,
ది 5—9—1952.

— శ్రీమతి కె. లక్ష్మీనారాయణమ్మ,
గ్రామీణ వయోజనవిద్యా బోధకుల శిక్షణ శిబిర కార్యదర్శి.

ANDHRA RASTRA PRARAMBHA VIDYA
Regd. M.N. 3766 Vol. 41. - No. 7




1952 అక్టోబరు 15 నుండి నవంబరు 14 వరకు

మేషం—ప్రతాపం - పుణ్యకార్యవిఘ్నం - తత్తరపాటు - శుభకార్య ప్రయాణములు.
వృషభం—లాభం - గృహమందు శుభకార్యములు ధనాదాయం - బంధువర్జనం - చోరభీతి.
మిథునం—పుణ్యకార్యచింతన - దేవతోపాసన - మంత్రబలం - శుభప్రవృత్తి - శుభకార్య సూచనలు - ధనాదాయము.
కర్కాటకం—శత్రుజయం - మిత్రప్రాప్తి - మితిమీరిన సంతోషము - ఆకస్మాత్కలహములు.
సింహం— జ్ఞాతివైరం - మానసికాందోళన - మతిభ్రమణ - మందబుద్ధి - మనోవ్యాధి - బంధువైరం - ధనవ్యయము.
కన్య—స్థానముచలనం-చోరదుష్టభీతి - తుందుడుకు - దుర్యాలోచనలు-దుష్టసహవాసము - ధననష్టము.
తుల—లాభవ్యయములు - మిత్రసందేశము - వెగటుపుట్టించిన భోజనం - ఆగంతుకమైన అశుభవార్త.
వృశ్చికం— రాజకీయభయం - నష్టము - మిత్రవైరం - జ్ఞాతికలహములు - భావి శుభసూచనలు - శుభస్వప్నములు.
ధనుస్సు—విక్రమము - లాభము - మిత్రబంధుదర్శనం లాభములు - అర్థప్రాప్తి.
మకరం— సంతానజననమునుండి మనోవిచారం దేహమందు దుష్టప్రకోపము - వైద్యచికిత్స - ధనవ్యయము - నీచజాతివల్ల దూషణాలు,
కుంభం—బంధుగృహవాసం - బలాభివృద్ధి - శుభకార్యప్రాప్తి - శుద్ధమనస్సు.
మీనం—శుభకార్యవ్యయములు - పుణ్యతీర్థగమనములు - జ్ఞాతిబంధులాభములు-బంధుగృహప్రయాణాలు.
మీ మీ జాతక కుండలిని అనుసరించి మీగోచారఫలాలు పరిణామము చెందుచుండును.

(ఈ సంవత్సరములో కార్తీకపౌర్ణమి - అశ్విని నక్షత్రముతో కలియుటవల్ల అక్కడక్కడ దేశములో ధూమకేతుసందర్శనము - గొప్పవారి (ప్రభుజన) పీడలు - మరణపరిస్థితులు - నదీప్రవాహములు - నదులు పొంగుట - వ్యవసాయనష్టములు - జననాశం - ముఖ్యముగా నవంబరు మొదలు 1953 మార్చి వరకు ప్రభువులకు, ప్రజలకు విరోధాలే కాక యుద్ధప్రయత్నములుగూడ జరిగి ఎక్కువ అశాంతి యేర్పడు సూచనలు గనబడుచున్నవి)

☞ సిద్ధయోగినీ, నాడీజ్యోతిష శాస్త్రరీత్యా జాతక, ముహూర్త, వాస్తు, ప్రశ్నవిషయములు, గ్రహపీడాది సర్వబాధలకు చికిత్సలు, మళయాళ, మహాకాళి, శక్తి, యామినీయోగినీ, కవచ, యంత్ర రాజసందర్భములు, సరసముగా తెలుపబడును.

కలయువారు నిలయము పేర వ్రాయవలెను.

దైవజ్ఞభూషణ, భిషగ్రత్న : పండిత డి. యస్. యన్. శాస్త్రి,
శ్రీ శివనాడీ జ్యోతిర్నిలయము, పవరుపేట - ఏలూరు. (పశ్చిమగోదావరిజిల్లా.)

Edited by Sri M. Venkata Ratnam Garu, B. A., & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.